కె. పౌస్తోవ్‌స్కీ

# మేలు మరవని పిచిక

చిత్రాలు: వి. పెరెబేరిన్, ఎస్. కలచోవ్
అనువాదం: అర్వియార్





"రాదుగ" ప్రచురణాలయం
మాస్కో



పాత గోడ గడియారంలో ఇత్తడి కమ్మరి బొమ్మ వుంది. అది చిన్న సీనారేకు ముక్కతో చేసిన సైనికుడి బొమ్మలా వుంది. సుత్తిని యెత్తింది అది. గడియారం క్లిక్ మంది. కమ్మరి సుత్తితో చిన్న యిత్తడి దాగిలిమీద మోదాడు. బంయ్‌మంటూ మోత గదిలో వినిపించింది. పుస్తకాల అల్మారా కిందనుంచి ఆ ధ్వని తరంగం దొర్లుకుపోయింది. తర్వాత వినిపించకుండా పోయింది.

కమ్మరి ఎనిమిది సార్లు కొట్టాడు. తొమ్మిదో సారి కొట్టబోతూ వుండగా చెయ్యి తటుక్కున ఆగిపోయింది. ఎత్తిన చెయ్యి ఎత్తినట్టే వుండిపోయింది. అలా చెయ్యి ఎత్తి ఓ గంట పూరా వుండిపోయాడు, తొమ్మిదయే దాకా. అప్పుడు దాగిలిమీద తొమ్మిది సార్లు కొట్టేడు.

మాషా కిటికీ పక్క నుంచుంది. వెనక్కి తిరగలేదు. తిరిగితే పెత్రోవ్నా మామ్మ తప్పకుండా లేస్తుంది. తనని పడుకో బెడుతుంది.

పెత్రోవ్నా సోఫామీద జోగుతోంది. అమ్మ బాలే డాన్సరు. యెప్పటి లాగానే థియేటర్‌కి వెళ్లిపోయింది. మాషాని తనతో కూడా యెప్పుడూ తీసికెళ్లదు.

థియేటరు చాలా పెద్దది. యెదర పెద్ద రాతి స్తంభాలు ఉంటాయి. కప్పుమీద నాలుగు కంచు గుర్రాలు కాళ్లు పైకెత్తి నుంచున్నాయి. ఒక మనిషి ఆ గుర్రాల్ని కళ్లేలు పట్టుకు తోలుతున్నాడు. అతను విజయ సూచకంగా తురాయి పెట్టుకున్నాడు. బాగా బలిష్ఠుడై వుండాలి. కప్పు చివరకంటా గుర్రాల్ని తోలి అక్కడ ఆపేడు. ఆ గుర్రాల ముందు కాళ్లు కప్పు అంచు పైన గాలిలో తేలి వున్నాయి. ఆ కంచు గుర్రాల కళ్లేల్ని అతను పట్టుకోకుండా వున్నట్టయితే యెంత గందరగోళం అయివుండేదో! మాషా వూహించుకో ప్రయత్నించింది. అవి కప్పు చివరనుంచి చౌకులోకి దౌడు తీసుకుపోయి వుండేవి. ధనధన పెద్ద గోల అయిపోయి వుండేది.



అమ్మ కొన్ని రోజులుగా ఆందోళన పడుతోంది. మొట్టమొదటి సారిగా సిండరెల్లా పాత్రలో నాట్యం చెయ్యబోతోంది. మొదటి ప్రదర్శనకి పెత్రోవ్నానీ, మాషానీ తీసికెడతానని మాట యిచ్చింది.

మొదటి ప్రదర్శనకి రెండ్రోజుల ముందు అమ్మ సొరుగులోనుంచి గాజుతో చేసిన చిన్న పూల గుత్తిని తీసింది. దాన్ని మాషా నాన్న ఆమెకి యిచ్చేడు. అతను నావికుడు. దాన్ని యెక్కడ్నో దూర దేశంలో కొన్నాడు.

మాషా నాన్న యుద్ధానికి వెళ్లిపోయాడు. వాళ్ల నౌకా సిబ్బంది నాజీ ఓడల్ని ముంచేసింది. వాళ్ల నౌకమీద దాడి జరిగింది. మాషా నాన్నకి దెబ్బ తగిలింది. కాని బతికి బయట పడ్డాడు. యిప్పుడాయన దూరంగా యెక్కడికో వింత పేరు వున్న కమ్‌చాత్కాకి ఓడమీద వెళ్లాడు. కాని వసంత రుతువు నాటికి వచ్చేస్తాడు.

సొరుగులోనుంచి ఆ పూల గుత్తిని తీసేటప్పుడు అమ్మ ఆ గాజు పువ్వులతో యేదో చెప్పింది. అది చాలా వింతగా వుంది. యింతవరకు అమ్మ తనెప్పుడూ వస్తువులతో మాట్లాడి యెరగదు.

''చూడండి, మీరు యెక్కువ కాలం యెదురు చూడాల్సిన పని లేదు'' అంది.

''దేని కోసం యెదురు చూడ్డం?'' అని మాషా అడిగింది.

''నువ్వు చిన్న పిల్లవి. నీకర్థం కాదు. 'నువ్వు సిండరెల్లా పాత్ర వేసినప్పుడు బాల్‌సీన్ అయిపోయాక దీన్ని నీ జాకెట్‌కి తగిలించుకోవడం మర్చిపోవద్దు' అని నాన్న దీన్ని నాకిచ్చినప్పుడు చెప్పారు. 'అప్పుడు నేను తన గురించి తలుచుకుంటున్నట్టు ఆయనకి తెలుస్తుంది' '' అంది అమ్మ.

''ఆఁ, అర్థమైంది'' అంది మాషా చిరచిరలాడుతూ.

''ఏమర్థమైంది?''

''అన్నీ అర్థమయ్యాయి'' అంది మాషా. ముఖం జేవురించుకుంది. తను చెప్పింది నమ్మకపోతే వూరుకోలేదు.

అమ్మ గాజు పూల గుత్తిని డ్రెస్సింగ్ టెబిల్‌మీద పెట్టింది. అది చాలా అల్పంగా వుందనీ, దాన్ని ముట్టుకోవద్దనీ మాషాతో చెప్పింది.



సాయంత్రం అయింది. డ్రెస్సింగ్ టేబిల్‌మీద గాజు పువ్వుల గుత్తి మెరుస్తోంది. మాషా వీపు యిటు తిప్పి నుంచుంది. చీమ చిటుక్కు మంటే వినిపించేటంత నిశ్శబ్దంగా వుంది. ప్రపంచమంతా నిద్ర పోతున్నట్టు వుంది. యిల్లు, తోట బయలు, గుమ్మం కాపలా కాసే రాతి బొమ్మ సింహం అన్నీ నిద్రపోతున్నట్టే వున్నాయి. బొమ్మ సింహం యింకా యింకా తెల్ల బడుతోంది — మరి దానిమీద మంచు పడుతోందిగా, అందుకని. మాషా, గదిలో వెచ్చగా వుండడానికి పనిచేసే హీటరూ, శీతాకాలం మాత్రమే మెలుకువగా వున్నట్టున్నాయి. మాషా కిటికీలోనుంచి బయటికి చూసింది. హీటరు వెచ్చటి పాట పాడుతోంది, శీతాకాలం ఆకాశంమీదనుంచి తెల్లని మంచు తరకల్ని పంపిస్తోంది. ఆ మంచు తరకలు వీధి దీపస్తంభం పక్కనుంచే యెగురుకుంటూ పోయి నేలమీద పడుతున్నాయి. అంతలా నల్లగా వున్న ఆకాశంలోనుంచి యింత తెల్లని మంచు తరకలు యెలా పడుతున్నాయి చెప్మా అని మాషాకి ఆశ్చర్యం కలిగింది. శీతకట్టు మంచు తుఫాన్లు యిలా వుంటే అమ్మ డ్రెస్సింగ్ టేబిల్‌మీద వున్న సజ్జలో యెర్రటి పెద్ద పువ్వులు యెలా వికసిస్తాయి? అది అర్థం కాదు. అన్నిటినీ మించి గందర గోళంగా కనిపించేది యింకోటుంది. కిటికీ అవతల చెట్టుకొమ్మ మీదున్న బూడిద రంగు ముసలి కాకి. అది రెప్పవాల్చకుండా మాషా కేసి అలా చూస్తూనే వుంటుంది.

గదిలోకి తాజా గాలి కోసం కిటికీ పైరెక్కని పెత్రోవ్నా తెరు స్తుంది. అప్పుడు ఆమె మాషాని పళ్లు తోముకోవడానికి తీసుకువెడు తుంది. అందుకోసమనే ఆ కాకి చూస్తూ వుంది.

పెత్రోవ్నా మాషా గదిలోనుంచి అవతలికి వెడితే చాలు, కాకి కిటికీ పైరెక్కలోనుంచి లోపలికి వచ్చేస్తుంది. అందుబాటులో వున్న వస్తువుని అంకించుకుని ఠక్‌మని బయటికి వెళ్లిపోతుంది.

దానికి యెంత తొందరో! చదరమీద కాళ్లు తుడుచుకోవడం కూడా మర్చిపోతుంది. బల్లంతా మరకలు చేస్తుంది.

పెత్రోవ్నా మళ్లీ గదిలోకి వస్తుంది. ఆ మరకలు చూస్తుంది ''ఆ, దొంగభడవ మళ్లీ యేదో యెత్తుకుపోయింది!'' అని చేతులు బారలు తీస్తూ అరుస్తుంది.



మాషా కూడా చేతులు బార చాపుతుంది. యిద్దరూ కలిసి గబగబా వెతుకుతారు, కాకి యేం యెత్తుకుపోయిందో మరి! మామూలుగా గదిలో యేదన్నా తినే వస్తువు కనిపిస్తే కాకి యెత్తుకు పోతుంది. ఓ అప్పచ్చో, పంచదార బిళ్లో యేదో ఒకటి.

ఆ కాకి వేసవికాలంలో ఐస్‌క్రీం అమ్మే బడ్డీలో వుంటుంది. శీతాకాలంలో ఆ బడ్డీని కొయ్యపలకలతో మూసేస్తారు. చిరుబురులాడే ముసలి కాకి అది. తను యెత్తుకొచ్చిన వస్తువులతో ఆ బడ్డీ నెరదల్ని పూడ్చేసింది. ఆ వస్తువుల్ని యిరుగుపొరుగు పిచికలు యెత్తుకు పోకుండా భద్రంగా చూసుకుంటుంది.

పిచికలు ఐస్‌క్రీం బడ్డీలోకి దొంగగా వచ్చాయనీ, ఓ ఆపిల్ తొక్కనో, గడ్డకట్టిన అప్పచ్చినో, పగుళ్లలో దోపిన చాకొలెట్ కాగితం ముక్కనో ముక్కుతో అవి పొడిచాయనీ దానికి కల వస్తుంది. నిద్రలోనే కోపంగా 'కావు కావు'మని గీపెడుతుంది. సందు మొగలో వున్న పోలీసు వింటాడు. చుట్టూ చూసి జాగ్రత్తగా వింటాడు. రాత్రిళ్లు అలాంటి అరుపులు అతనికి కొన్ని రోజులుగా వినిపిస్తున్నాయి. అతను యేమిటా అని కలవరపడుతున్నాడు. అతను ఆ బడ్డీ దగ్గరికి కొన్ని సార్లు వెళ్లాడు. వీధి దీపం వెలుతురుకి కంటిమీద చెయ్యి అడ్డం పెట్టుకుని లోపలికి పట్టి పట్టి చూశేడు. కాని లోపల అంతా చీకటి. విరిగిన అట్టపెట్టె మాత్రమే అతనికి కనిపించింది.

ఒక రోజున బడ్డీ కొట్లో కాకికి చిన్న పిచ్చిక కనిపించింది. దాని యీకలు రేగిపోయి వున్నాయి. దాని పేరు పాష్క.

అవి పిచికలకి గడ్డు రోజులు. యెక్కడా గుగ్గిళ్లు కనిపించడడం లేదు. మహా నగరంలో గుర్రాలు తక్కువ అయిపోవడంతో యీ కరువొచ్చి పడింది. పాత రోజుల్లో యిలా కాదు. యీ పిచ్చిక తాత కిచకిచ దానికి చెప్పేదు ఆ కథ. పిచికలట బళ్ల గేటుల్లో గెంతుతూ వుండేవట. గుర్రాలు దాణా తింటూ వుంటే కొన్ని గుగ్గిళ్లు నేలమీద ఒలికి పోతాయిగా మరి! వాటిని యేరుకుని తినడానికి అక్కడ చేరేవట.

మరిప్పుడో! యెక్కడ చూసినా కార్లూ, లారీలూనూ! గుర్రాలు కరకర నములుతూ గుగ్గిళ్లని తిన్నట్టు, కార్లు గుగ్గిళ్లు తినవు. వాటి బదులవి గాలన్ల కొద్దీ చమురు తాగుతాయి. పాడు వాసనా అదీనీ!

విషం! అంచేత నగరాల్లో పూర్వంలాగా పిచికలు లేవు, తగ్గిపోయాయి. కొన్నేమో పల్లెటూళ్లకి వెళ్లిపోయాయి. అక్కడ గుర్రాల దగ్గర చేరచ్చు. కొన్ని రేవు పట్టణాలకి వెళ్లిపోయాయి. అక్కడ ధాన్యం ఓడలకి యెత్తుతారు కదా. అంచేత పిచికలకి సంతోషంగానే వుండేది. యెప్పుడూ ఆకలికి మాడలేదు.

''పూర్వం రోజుల్లో పిచికలు రెండేసి వేలు, మూడేసి వేలు కలిసి గుంపుగా పోగయేవి. యే గుంపేనా ఝామ్మంటూ యెగిరిందో, చూస్కో! బండి గుర్రాలు కూడా ముట్టె పైకెత్తి 'అబ్బ యీ పిచికలతో వేగలేకపోతున్నాం' అని మూలిగేవి.

''బజార్ల దగ్గర పిచికలు చేసే యుద్ధాలు యెరగవు నువ్వు! యీకలు అన్ని వేపులకీ యెగిరిపోయేవి. జనం యివాళ అలాంటి యుద్ధాలకి తట్టుకోగలరా?'' అంటూ కిచకిచ తాత చెప్పేడు.

పాష్క బడ్డీలోకి దూసుకురావడం ముసలి కాకి చూసింది. బడ్డీలో దేన్నీ యింకా ఆ పిచిక పొడవకుండానే దాని నెత్తిమీద ముసలి కాకి ముక్కుతో పొడిచింది.

పాష్క దొర్లిపడిపోయింది. కళ్లు మూసుకుంది. చచ్చిపోయినట్టు నటించింది.

కాకి దాన్ని అవతలికి విసిరేసింది. గర్విగా కావు కావుమని అరిచింది. లోకంలో వున్న అన్ని పిచ్చికల్నీ దుంపశార్థం పెడుతూ తిట్టిపోసింది.

పోలీసువాడు చుట్టూ చూశాడు. బడ్డీ దగ్గరికి వెళ్లేడు. పాష్క మంచుమీద పడి వుంది. నొప్పితో దాని తల పగిలిపోతోంది. నీరసంగా ముక్కు తెరుస్తోంది, మూస్తోంది.

''ఆఁ, కొంపాగోడూ లేని దానా! నీకుందిలే యిక!'' అన్నాడు పోలీసు. చేతి తొడుగుని విప్పి, పిచికని అందులో పెట్టి, దాన్ని జేబులో దోపుకున్నాడు.



పాష్క ఆ మనిషి జేబులో, చేతి తొడుగులో వుండి యేడ్చింది. చాలా బాధగా వుంది. ఆకలి వేస్తోంది. ఆ పోలీసాయన జేబులో కాసిని రొట్టె తునకలు వుంటే యెంత బావుణ్ను! ఖర్మ, యేమీ లేవు! వెధవ్వాసన కొట్టే పొగాకు ముక్కలు తప్ప.



ఆ మర్నాడు పెత్రోవ్నా ఆడుకోవడానికని మాషాని పార్కుకి తీసుకెళ్లింది. పోలీసాయన వాళ్ల దగ్గరికి వెళ్లాడు.

''నీకు పిచిక కావాలా? యింటి దగ్గర పెంచుకోవడానికి'' అని మాషాని అడిగాడు.

తనకి పిచిక కావాలని యెంతగానో వుందని మాషా అంది. పోలీసాయన ముఖం ఎండకీ వానకీ వాసిపోయినట్టు వుంది. యెర్రగా వుంది. అతను పళ్లికిలించాడు. జేబులోనుంచి చేతి తొడుగు తీశాడు. పిచిక పాష్క ఆ తొడుగులో వుంది.

''యిదిగో. తొడుగుతోనే తీసుకో లేకపోతే యెగిరిపోతుంది. తర్వాత తొడుగుని నాకివ్వచ్చులే. నేను మధ్యాహ్నం దాకా యిక్కడ వుంటాను'' అన్నాడు.

మాషా పిచికని యింటికి తీసికెళ్లింది. బ్రష్‌తోటి యీకల్ని సాపు చేసింది. తిండి పెట్టింది. గదిలో ఎగర నిచ్చింది. పాష్క సాసరు అంచు మీద కూర్చుని కొంచెం కొంచెంగా టీ చప్పరించింది. తర్వాత ఇత్తడి కమ్మరి బొమ్మమీదకి ఎగిరి నెత్తిమీద కూర్చుంది. కునుకు తీద్దామను కొనే లోపలే కమ్మరికి కోపం వచ్చింది. సుత్తి ఆడించేడు. పాష్కని కొడతాడా యేమిటి చెప్మా అనిపించింది. పాష్క యెగిరిపోయి యింకో కంచు బొమ్మ నెత్తిమీద కూర్చుంది. ఆ తల ఇవాన్ క్రిలోవ్‌ది. ఎన్నో అద్భుత కథలు రాసిన క్రిలోవ్. ఆ తలమీద జారిపోకుండా కూచోవడం పాష్కకి కష్టం అయింది. యీ లోపున కోపంగా వున్న కమ్మరి దాగిలిమీద కొట్టాడు — మొత్తం పదకొండు సార్లు.

పాష్క ఒక పగలూ ఒక రాత్రీ మాషా గదిలో గడిపింది. ముసలి కాకి కిటికీ పై రెక్కలోనుంచి లోపలికి రావడం చూసింది. బల్లమీదున్న ప్లేట్లోనుంచి ఆపిల్ పండు ముక్కని ఆ కాకి యెత్తుకు పోవడమూ చూసింది. పాష్క ఎర్ర పువ్వుల సజ్జ వెనక నక్కింది. కదలకుండా మెదలకుండా కూచుంది.

ఆ తర్వాత పాష్క రోజూ మాషాని చూడ్డానికి వచ్చేది. మాషా పెట్టిన రొట్టె తునకలు తినేది. తనకి మాషా యెంతో మేలు చేసింది. యెలా మాషాకి బదులు తీర్చుకోవాలా అని ఆ పిచిక ఆలోచించేది. ఒక రోజున బిగుసుకుపోయిన గొంగళీ పురుగుని తెచ్చింది. పార్కులో



ఓ చెట్టుమీద దాన్ని చూసింది. కాని మాషా దాన్నెలా తింటుంది! ఛీ! పెత్రోవ్నాకి చిరాకొచ్చింది. ఆ పురుగుని కిటికీలోనుంచి విసిరేసింది.

తర్వాత పాష్కకి ముసలి కాకిమీద పగతీర్చుకోవాలనిపించింది. ముసలి కాకి యెత్తుకుపోయి బడ్డీకొట్టు కంతల్లో కూరిన చెత్తాచెదారాన్ని ముక్కుతో పొడిచి యివతలికి లాగడం మొదలెట్టింది. వాటన్నిట్నీ మాషాకి తిరిగి అప్పగిద్దామనుకొంది. ఒక రోజున పాష్క ఆమెకి నూగు బెండ తెచ్చి యిచ్చింది. యింకో సారి యెండిపోయిన అప్పచ్చి ముక్కని తెచ్చింది. ఆ తర్వాత చాకొలెట్‌కి చుట్టే ఎర్ర కాగితాన్ని తెచ్చింది.

కాకి వేరే యెక్కడ్నుంచో కూడా అవీ యివీ యెత్తుకొస్తూ వుండేది. పాష్క పొరపాటు పడి మాషాకి యెవళ్లవళ్లవో వస్తువులు తెచ్చి యిస్తూ వుండేది. ఓ సారి జేబు దువ్వెన ముక్కని తెచ్చింది. యింకో సారి చిరిగిపోయిన పేక ముక్కని తెచ్చింది (అది కళావరు రాణీ), తర్వాత పెన్ను పాళీని తెచ్చింది.

పాష్క యేది తెచ్చినా యెగురుకుంటూ వస్తుంది. దాన్ని నేలమీద పడేస్తుంది. కొన్ని సార్లు గదిలో చక్కర్లు కొడుతుంది. తర్వాత చిన్న పూలు బంతిలా కిటికీలోనుంచి జామ్మని దూసుకుపోతుంది.

ఈ రాత్రి భోజనాలయాక పెత్రోవ్నా నిద్రపోయింది. కాకి కిటికీ పైరెక్కలోనుంచి వస్తుందేమో చూడాలని మాషాకి ఆతృతగా వుంది. కాకి రావడం నిజానికి ఆమె చూడనే లేదు.

కుర్చీమీదకి యెక్కి కిటికీ పైరెక్క తెరిచింది. తర్వాత బట్టల బీరువా వెనక్కాల దాంకుంది. మొదట పెద్ద మంచు తరకలు లోపల పడ్డాయి. నేలమీద పడి కరిగిపోయాయి. తర్వాత యేదో గీరుకున్న శబ్దం వినిపించింది. కాకి కిటికీ పైరెక్కలోనుంచి లోపలికి దూరింది. అమ్మ డ్రెస్సింగ్ టేబిల్‌మీదకి గెంతింది. అద్దంలో చూసుకుంది. యీకల్ని విదుపుకుంది. అద్దంలో కోపంగా వున్న మరో ముసలి కాకి కనిపిస్తోందిగా మరి! అప్పుడు 'కావు కావు'మని అరిచింది. ఆ చిన్న గాజు పూల గుత్తిని అంకించుకుని కిటికీలోనుంచి పారిపోయింది.

మాషా గీపెట్టింది. పెత్రోవ్నాకి మెలుకువ వచ్చింది. తిడుతూ మూలగడం మొదలెట్టింది. అమ్మ థియేటర్‌నుంచి తిరిగివచ్చింది. యేం

జరిగిందో ఆవిడకి తెలిసింది. గట్టిగా యేడ్చింది. మాషాకి కూడా యేడుపొచ్చింది. 'గాజు పూల గుత్తి దొరుకుతుందిలే, వెధవ కాకి దాన్ని మంచులో పారెయ్యకుండా వుంటే' అని పెత్రోవ్నా అమ్మని వూరుకోబెట్ట ప్రయత్నించింది.

మర్నాడు పొద్దుట పాష్కా వచ్చింది. క్రిలోవ్ కంచు బొమ్మ తలమీద ఒదిగి కూర్చుంది. పూల గుత్తి పోయిందన్న వార్త వింది. యీకలు విదిలించుకుని యేం చెయ్యాలి చెప్మా అని ఆలోచించింది.

తర్వాత అమ్మ రిహార్సల్‌కి వెళ్లింది. పాష్కా కూడా బయల్దేరింది. అది అడ్వర్‌టైజ్‌మెంట్ బోర్డులమీదకి యెక్కింది. అక్కణ్ణించి దీపస్తంభాలమీదకి, ఆ తర్వాత చెట్లమీదకి యెగురుకుంటూ వెళ్లింది. చివరకి థియేటర్ దగ్గరికి చేరింది. కప్పుమీదున్న ఓ గుర్రం తలపైన కూర్చుంది. ముక్కు తుడుచుకుంది. కాలితో కంటి రెప్పమీద గోక్కుంది. కిచకిచమని యెగిరిపోయింది.

ఆ సాయంత్రం అమ్మ లేసు అంచు వున్న తెల్లని పై గౌను తొడుక్కొమ్మని మాషాతో చెప్పింది. పెత్రోవ్నా చక్కటి సిల్కు శాలువా కప్పుకుంది. అందరూ కలిసి థియేటర్‌కి వెళ్లారు.

అప్పుడు పాష్కా యిరుగుపొరుగు పిచికలన్నిట్నీ పిలిచింది. కిచకిచ తాతయ్య అలా చెయ్యమని చెప్తూ వుండేవాడు. అవన్నీ కలిసి ఐస్‌క్రీం బడ్డీమీద దాడి చెయ్యబోతున్నాయి. అందులోనే ముసలి కాకి గాజు పూలగుత్తిని దాచింది.



మొదట్లో యీ పిచికల గుంపు దగ్గర్లో వున్న ఇళ్లకప్పులమీద చేరి కాకిని ఉడికించడం మొదలెట్టాయి. కాకికి కోపం వచ్చి తమ మీదకి దూకుతుందనుకొన్నాయి పిచికలు. అప్పుడు అది బయట దానిమీద పడచ్చు. బయట బోలెడు జాగా వుంది. అన్ని వేపులనుంచీ కాకిమీదకి అవి యెగరచ్చు. కాని కాకి ముసల్ది, తెలివైన ఘటం. అది పిచికల పథకం యేమిటో వూహించింది. ఐస్‌క్రీం బడ్డీలోనే వుండిపోయింది.

ఆఖరికి పిచికలు ధైర్యం పుంజుకున్నాయి. ఒక దాని తర్వాత ఒకటి కాకి వున్న బడ్డీలోకి దూసుకుపోయాయి.

గోలగోల అయిపోయింది. దాంతో బయట పెద్ద గుంపు పోగయింది. పోలీసు పరిగెత్తుకుంటూ వచ్చాడు. అతను బడ్డీలోకి తొంగి



చూశాడు. కాని అతనికి పిచికల యీకల పోగు తప్ప యేం కనిపించలేదు.

''అరె, యిది అచ్చం యుద్ధమే'' అన్నాడు.

తలుపు దగ్గర బోటుగా వున్న అట్ట ముక్కల్ని వూడపీకడం మొదలెట్టాడు. యుద్ధం ఆపు చెయ్యాలనుకున్నాడతను.

సరిగ్గా అదే సమయంలో థియేటర్‌లో ఆర్కెస్ట్రా బృందం వయొలినిస్టులు, సెల్లోయిస్టులు కమాన్లు యెత్తారు. సంగీత దర్శకుడు తెల్లని చేతిని యెత్తి మెల్లిగా వూపాడు. భారమైన వెల్వెట్ తెర అలల్లా కదిలి స్టేజీకి అటూ యిటూ విడిపోయింది. సంగీతం స్థాయి హెచ్చింది.

ఎండ పడుతూ వున్న పెద్ద గది మాషాకి కనిపించింది. ధగధగ మెరిసిపోయే బట్టలు వేసుకున్న సవతి అక్క చెల్లెళ్లు కనిపించారు. కుళ్లుమోతు సవతి తల్లి కనిపించింది. మాషా వాళ్లమ్మ కూడా కనిపించింది. నాజూగ్గా అందంగా వుంది. బూడిద రంగు పీలికలు తొడుక్కుంది.

''సిండరెల్లా'' అనుకొంది మాషా. స్టేజీమీదనుంచి కళ్లని తిప్పనే లేకపోయింది.

తర్వాత రంగం వచ్చింది. రాజ భవనం కనిపించింది. వెన్నెలతో బాటుగా నీలం, ఎరుపు, బంగారం దీపాలు ప్రకాశించాయి. అర్ధరాత్రి గంట మోగగానే అమ్మ హడావుడిగా వెళ్లిపోయింది. అప్పుడు ఆమె కాలికి వున్న చిన్న గాజు చెప్పు వూడిపోయింది.

అమ్మ బాధపడినప్పుడు సంగీతం బాధపడింది. అమ్మ సంతోషంగా వున్నప్పుడు సంగీతం సంతోషంగా వుంది. ఆ వయొలీన్లు, సెల్లోలు, పిల్లనగ్రోవులూ, బూరాలు అన్నీ ప్రాణం వున్న వాటిలాగే కనిపించాయి. యిది బాగుంది. సంగీత దర్శకుడితో సహా అవి అన్నీ అమ్మకి సాయం చెయ్య ప్రయత్నిస్తున్నట్టే కనిపించింది. సంగీత దర్శకుడు చాలా ప్రయత్నిస్తున్నాడు, పాపం, ఒక్క సారి కూడా హాల్లో జనంకేసి తిరగలేదు. నిజంగా బాధగా వుంది. మరి హాల్లో బోలెడు మంది పిల్లలు వున్నారు — మెరిసే కళ్లతో, గులాబీ రంగు బుగ్గల్తో.

థియేటర్లలో ప్రేక్షకులకి సీట్లు చూపించే ముసలి గేట్‌కీపర్‌లు యెప్పుడూ యే ప్రదర్శనా చూడరు. మామూలుగా ప్రోగ్రాం కాగితాలని అమ్ముతూ ఒపేరా గ్లాసులు అద్దెకిస్తూ వసారాల్లో నుంచుంటారు. అయినా యిప్పుడు వాళ్లు కూడా మెల్లిగా తలుపులు వేసేసి మాషా

అమ్మని చూస్తూ నుంచుండి పోయారు. అమ్మ యెంతో బాగా నాట్యం చేస్తోంది. ఒకతను కళ్లు ఒత్తుకున్నాడు. అవును మరి, అమ్మ నాన్న అతనికి స్నేహితుడు కదా. అమ్మ నాన్న చనిపోయాడు. యితని లాగానే ఆయనా యిక్కడ పనిచేశాడు.

ఆఖరికి బాలే అయిపోవచ్చింది. ముక్తాయింపుగా సంగీతం సంతోషంగా మోగింది. అందరూ సంతోషంగా వున్నారు. కాని సిండరెల్లాకి కన్నీళ్లు తిరుగుతున్నాయేమో అని ఆశ్చర్య పడుతున్నారు. సరిగ్గా ఆ సమయంలో యీకలు రేగిపోయిన చిన్న పిచిక స్టేజీమీదకి యెగిరి వెళ్లింది. అది నానా యాతనా పడి మెట్లూ, వసారాలూ దాటుకుంటూ లోపలికి వచ్చింది. ఆ పిచిక హోరాహోరీ యుద్ధం చేసి వచ్చిందని కనిపిస్తూనే వుంది.

వందల దీపాల వెలుతురుతో కళ్లు మిరుమిట్లు గొలిపి దానికి కనిపించలేదు. అది స్టేజీమీద చక్కర్లు కొట్టింది. అది ముక్కుతో దేన్నో పట్టుకుంది. స్ఫటికపు కొమ్మలాగా మెరుస్తోందది.

హాల్లో జనం కలకలంగా వున్నారు. తర్వాత సద్దు మణిగింది. సంగీత దర్శకుడు చెయ్యి యెత్తాడు. ఆర్కెస్ట్రా బృందం వాయించడం ఆపు చేసింది. వెనక్కాల వరసల్లో కూర్చున్న వాళ్లు యిదంతా యేమిటా అని చూడ్డానికి తమ సీట్లలోనుంచి లేవబోయారు. పిచిక సిండరెల్లా దగ్గరికి ఎగిరింది. సిండరెల్లా తన చెయ్యి చాచింది. పిచిక చిన్న గాజు పూల గుత్తిని ఆమె చేతిలోకి జారవిడిచింది. సిండరెల్లా దాన్ని వణికే వేళ్లతో జాకెట్‌కి తగిలించుకుంది.

సంగీత దర్శకుడు చెయ్యి యెత్తాడు. మరో సారి సంగీతం మోగింది. హాల్లో జనం జోరుగా చప్పట్లు కొట్టారు. దీపాలు వూగాయి కూడా ఆ చప్పట్లకి. పిచిక పైకి యెగిరి స్ఫటికపు దీపం సెమ్మామీద కూర్చుంది. రేగిపోయిన యీకల్ని సాపు చేసుకుంటూ కూర్చుంది. మాషా తనకి చేసిన మేలు మర్చిపోలేదు అది బదులు తీర్చుకుంది.

సిండరెల్లా హాల్లో జనంకేసి తిరిగి వందనం చేసింది. చిరునవ్వు నవ్వింది. తన అమ్మ అని తెలిసివుండకపోతే మాషా అసలు పోలికే పట్టలేకపోయేది.

రాత్రి బాగా పొద్దుపోయాక మాషా మంచంమీద చేరింది. యిక



నిద్రపోతుంది, అప్పుడు ''అమ్మా, నువ్వు పూల గుత్తిని తగిలించుకున్నప్పుడు నాన్న గుర్తువచ్చారా?'' అని అడిగింది.

''అవునమ్మా'' అంది అమ్మ, కాసేపాగిం తర్వాత.

''మరైతే యెందుకు యేడిచావు?''

''నాకు చాలా సంతోషమైంది, అందుకని. మీ నాన్నలాంటి వాళ్లు లోకంలో వున్నారు కదా అని.''

''ఒట్టిది, సంతోషంగా వున్నప్పుడు మనుషులు నవ్వుతారు'' అని మాషా గొణిగింది.

''కొంచెం సంతోషం అయితే నవ్వుతారు. గొప్ప సంతోషం కలిగితే యేడుపొస్తుంది. వూఁ, యిక పడుకో'' అంది అమ్మ.

మాషా నిద్రపోయింది. పెత్రోవ్నా కూడా నిద్రపోయింది. అమ్మ కిటికీ దగ్గరికి వెళ్లింది. పాష్కా బయట ఓ కొమ్మమీద కూర్చుంది. అదీ నిద్రపోతోంది. అంతా నిశ్శబ్దంగా వుంది. ఆకాశంనుంచి జారే పెద్ద మంచు తరకల వల్ల యింకా బాగా నిశ్శబ్దం ఆవరించుకుని వుంది. అమ్మ అలానే నుంచుంది. కమ్మని కలలు, అద్భుత కథలు రాత్రి మంచులాగా మృదువుగా జారి వస్తాయని అనుకుంటూ నుంచుంది.



К. Паустовский
РАСТРЕПАННЫЙ ВОРОБЕЙ
*на языке телугу*

K. Paustovsky
THE RUFFLED SPARROW
*In Telugu*



సోవియట్ యూనియన్‌లో ముద్రింపబడింది

ISBN 5-05-001613-4